44 ఈపట్టుకృపతోపడి
చేపట్టియుబ్రోవకున్న ♦ జీవించను నా
యాపదలదీర్చినాకుఁ
బ్రాపై రక్షింపవయ్య ♦ ప్రబలత రామా!

45 ఎన్నగజాలనికష్టము
లెన్నియుగల్గినను మదిని ♦ యెంతో ప్రేమఁ
నిన్నే నెరనమ్మితినా
బన్నములఁ దీర్చిబ్రోవు ♦ భవహర రామా!

46 బ్రతికినకాలములోపల
బ్రతుకు తెరవుజూపిబ్రోవు ♦ పరమకృపాళో
బ్రతికించుటనీపనియని
హితవుగనీవెరిగి ♦ యున్నదేగద రామా!

47 ఘనముగనిన్నెప్పుడు
నా మనమున ♦ స్మరియింపుచుంటి మదిని
వికాసమ్మునుగల్గచేసి
బ్రోవుముయినవంశజ ♦ దేవరాఘువేశ్వర రామా!

48 ననురక్షించెడిమార్గము
ఘనముగయోచించిబో్రివు ♦ కరుణాకరునే
వినయముతోమతనీపద
వనజములే నమ్మియున్న ♦ వాడనురామా!

49 నినునమ్మినట్టిభక్తుల
ననయముపోషింతుననుచు ♦ నార్యవరేణ్యుల్
ఘనముగవా్రిసిన గ్రంథము
లనువుగనేనమ్మియుంటి ♦ నయ్యారామా!

50 ఒకతరినినునమ్మిన-చో
సకలము నాశనమొనర్ప ♦ జాలుదువనుచున్
వొకతరిబో్రితువటంచున్
యకళంకుడవంచు ♦ కొందరందురు రామా!

51 ఒకపరియమితానందము
నొకపరి యత్యంతదుఃఖ ♦ మొసరింతువునీ
వకళంకుడనుచు పేర్వడి
యకళంకత తొలగిమెలగు ♦ టరహామెరామా!

52 పరిపరివిధముల వేడిన
మొరవినకుండెదవు యింత ♦ మూర్ఖతదగునే
శరణాగతరక్షణుడని
బిరుదెట్టులనిల్పుకొనెదు ♦ బింకమెరామా!

53 ఎక్కడితలిదండ్రులు సుతు
లెక్కడివారలు కళత్ర ♦ మెక్కడిమిత్రుల్
వొక్కరైన రారని ని
న్నొక్కనినే నమ్మియుంటి ♦ నొప్పుగరామా!

54 జననాదిపడెడుకష్టము
లను నీవిటుమరిచినన్ను ♦ యన్యాయముచే
యనుతగునేనీకిది మ
న్ననగాదని దెలిసిబ్రోవు ♦ నయముగరామా

55 నిజముగనుమున్నునీవా
గజరాజునుబ్రోచినట్టి ♦ ఘనుడవెయైన౯
నిజదాసవరులు బొగడగ
గజరాజునిరీతినన్ను ♦ గావుమురామా!

56 ఒక్కరువార్సినవాని మ
రొక్కరుగనివార్యుచుండు ♦ రొప్పగనెపుడుం
నిక్కమునటుచేసెడివా
రెక్కడగనరారుపాప ♦ మేమోరామా!

57 పాంచాలినిసభయందున
వంచనచేయంగనిన్ను ♦ వడిబార్థించపం
వంచనలేకనుబ్రోచితి
వంచితముగనామె చుట్ట ♦ మాయెనరామా!

58 సిలరూపముగానుండిన
నలగౌతముసతి నహల్య ♦ నతివేగముగా
చెలిగనుచేసితి నీకా
కలకంఠయుయేమియిచ్చె ♦ కట్నమురామా!

59 కనకకసిపుతనయుని పసి
తనముననేభక్తిమెచ్చి ♦ దయనేలియుబల్
వినుతులునొందతినన్నటు
యునఘునిగాచేసిబ్రోచ్చవు ♦ మయ్యారామా!

60 పరమద్రోహునితమ్ముని
పరమప్రీతిగనునీవు ♦ పాలించితినీ
సరివారలిలను లేరిక
తిరముగనన్నేలు ప్రేమ ♦ దీనుడ రామా!

61 కరిప్రహ్లాదుల ద్రౌపది
వరగౌతముపత్నియాది ♦ వారికివడిగా
వరములొసంగితినేయని
నరిపుచ్చగదలచెతేమొ ♦ చాలదురామా!

62 ఆకాలపువారలవలె
నీకాలపువారుబ్రతికి ♦ యెట్లుండంగల
రేకాలమునకుసరిపడ
నాకాలముబ్రోవదగుగ ♦ దయ్యారామా!

63 తడవుగజూచిననేనీ
పుడమినిజీవించగలనె ♦ పురుషోత్తమ యీ
వడువునదీక్షవహించియు
వడిగానన్నేలుమయ్య ♦ వదలకరామా!

64 జీవించియున్న నేగద
భావంబుననిన్నుగొల్చి ♦ ప్రారబ్ధంబుఁ
బోవీడచేయగల్గుట
నావిధిదయచేసిబ్రోవు ♦ మయ్యా రామా!

65 ప్రారబ్ధమనుభవింపక
తీరదనుచు దెలియుమనుచు ♦ దెల్పెదవేమో
యూరయనటులై ననునీఁ
గోరిభజింపంగనేల ♦ కో శ్రీరామా!

66 రుణబాధయొక్కఁడాయెను
గణనాతీతంబుదాని ♦ కష్టముదలపఁ
యణుమాత్రమాలసింపక
రుణబాధవిముక్తిచేయు ♦ రూఢిగరామా!

67 మనుజులనునెప్పుడేమై
ననుగోరిసనిచ్చుచుందు ♦ రంతోయింతో
ఘనుడవుభగవంతుఁడవు
ననునిట్టులకష్టపెట్ట ♦ న్యాయమె రామా!

68 తనకైశ్వర్యముగలదని
తనకుదానెసంతసింప ♦ దగునేయరయన్
తనవారినైనయాదర
మొనరింపకయున్ననేమి ♦ మురిపెమురామా

69 సిరిగలవారలుగాదెను
తెరచువరకులేనివారు ♦ వెర్రిల్లుదురనుచున్
నరులాడుసామెతగనా
తెరవమ్యోనికేమిదారి ♦ దెల్పుమురామా!

70 అండజవాహనవినునీ
యండగలదటంచుమదికి ♦ యతిధైర్యము
మొండిజరిచియుంటినిరన్
దండిగకరుణించవయ్య ♦ దశరథరామా!

71 కుయ్యోమొఱ్ఱోయనినే
వెయ్యివిధంబులను వేడ ♦ వినకుండెదు న
న్నియ్యడనైనను మొరవిని
చయ్యనరక్షించు లోక ♦ సన్నుతరామా!

72 ఎప్పటికి యేదివిధిన్కృత
మప్పటికట్లగును న్యాయ ♦ మన్యాయము యి
తిప్పలుపడ నేమిటికని
యెప్పగనీవూరకుండు ♦ టుచిత మెరామా!

73 ధనవంతుల ధరణీశుల
మనములుసమయంబులెరిగి ♦ మరియాచించ
గను చేత గానివాడను
ననుకరుణనుబ్రోవుమయ్య ♦ సయముగరామా!

74 ఆజగరయోగముబూనియు
భజియింపుచునుంటినిన్ను ♦ పరమప్రీతి
గజిబిజిచేయకబ్రోవుము
గజవరదా దేవదేవ ♦ కరుణనురామా!

75 పట్టుగనిన్నె దనమ్మిన
పొట్టకు బట్టకునులేక ♦ పోజేసితినీ
విట్టివాడవని దెలిసిన
గట్టిగనీదరికిరాను ♦ గద శ్రీరామా!

76 వనములవసించుమునులై
నను కడపటిదినములకును ♦ ననువుగ ద్రవ్యం
బొనగూర్తురటుల కాన్సై
ననుగూర్చక నీదుకృపనె ♦ నమ్మితి రామా!

77 నక్తుప్రస్తునివలె నీ
భక్తిగల్గియుండుపనికి ♦ పాటుపడకనే
ముక్తికినిదారిజూచుచు
యుక్తముగానిన్నెనమ్మి ♦ యుంటినిరామా!

78 గ్రంథములలోనవ్రాసిన
చందములనువినియుకనియు ♦ సత్యములనుచ
డెందముననమ్మియంధుని
చందమునను తిరుగుచుంటి ♦ నవమలరామా

79 నీదాసులకెప్పుడు యే
బాధలుగల్గిననుదీర్చు ♦ బాధ్యతనీదం
చాదనివ్రాసినవ్రాతల
నాదరముగునట్లుచేయక ♦ య్యారామా!

౮౦ బమ్మెరపోతనకవివరు
సమ్మతిగాఁ బ్రోచితనుచు • సత్కవివర్యుల్
యిమ్ముగనుబల్కినదిమది
నమ్మినమ్మితయ్య బ్రోవు • సయముగ రామా!

౮౧ అర్థంబంతయునీకిఁషి
నిర్ధనుఁడై యప్పుబడిన • నీదాసునకున్
యర్థ మొసగిబ్రోచివది యు
దార్థముగాఁ జేసిబ్రోవు • దశరథ రామా!

౮౨ నీచారిత్రంబంతయు
తోఁచినటుల వ్రాసినాఁడ • తొందరపడకన్
యాచించు వారలనుమది
యోచించియుబ్రోవకుండు • టుచితమె రామా

౮౩ చిన్నతనమునుండియునీ
సన్నిధియగుభద్రగిరికి • జనవలెనంచెన్నె
న్నెన్నొ గతులఁగోరుచు
నున్నవాఁడ కోర్కెతీర్పు • మొప్పఁగ రామా!

84 నేరచియించినకథలను
శ్రీరమణాసీమ మొదట ♦ చెలువముతోడఁ
చేరివినుపింపవలెనని
కోరికతోనున్నవాఁడ ♦ గుణనిధిరామా!

85 దేవరనాకోరికలిం
దీవరాక్షదీర్చిబ్రోవు ♦ దీనదయాళు
భావజజనకదయానిధి
నా విన్నపమాలకించు ♦ నయముగరామా!

86 శుభమగుస్వప్నంబాయెను
యిభరక్షణభద్రగిరికి ♦ నేతెంచెదనా
కభయమొసగిరక్షింపుము
శుభకరనీసేవజేయు ♦ చుంటినిరామా!

87 భద్రగిరిని నీకథలను
భద్రముగావినిపిదప ♦ బ్రాహ్మణులకు ని
ర్నిద్రితముగసంతర్పణ
మద్రిజవినుతాయొనర్తు ♦ మహాత్మారామా!

88 నినుఁదలంచినంతమాత్రనె
ఘనపాపములెల్లఁదొలఁగ ♦ గాఁగలవనుచుఁ
యనుకొనెడిమాటదబ్బర
గనుచేయఁగఁబూనఁదగదు ♦ గద శ్రీరామా!

89 కలలు చిత్రచిత్రములుగ
గలుగుచుండెవాని దెలియ ♦ గాఁజాలక నే
కలవరమునొందుచుంటిని
కలవరమునుదీర్చిబ్రోవు ♦ కరుణను రామా!

90 తిరుమణిశ్రీచూర్ణంబును
కరమొప్పగఫాలమందు ♦ కమనీయ్యముగా
ధరియించి స్వప్నమునఁ
దరిశనమొసగితివి రాత్రి ♦ దయతో రామా!

91 ఈరాత్రిస్వప్నమున మీ
రారయుమాయన్నవలెనె ♦ యగుపడినాతో
కూరిమిగముచ్చటింపగ
మీరినయానందమయ్యె ♦ మిముగన రామా!

92 కలగనిమేల్కొనకన్నుల
జలజలనానందభాష్ప ♦ జలములురాలన్
కలనాదుపత్నికపుడే
తెలిపియునానందమొంది ♦ తిని శ్రీరామా!

93 ఎన్నెన్నొగతులవేడిన
చిన్నపిల్లలకునువవ్వా ♦ చేతికినిడినట్లు
న్నను సంతసపెట్టిన
వన్నా నన్నిట్లుచేయ ♦ నగునేరామా!

94 ఎందుకుతిప్పలుబెట్టెను
ముందుపనికిదారిజూపి ♦ మోదముతోనా
డెందమునగల్గుకోరిక
లందముగావేగదీర్చు ♦ మయ్యారామా!

95 కోరికలనుదెల్పెదవిను
దారయనేవ్రాసినట్టి ♦ హరిచారిత్రల్
ధీరమతినీదుసన్నిధి
నోరుపుతో చదువచేయు ♦ టొక్కటిరామా!

96 నీభద్రాద్రినిలయమునఁబల్
ప్రాభవముగనీదుయమట ♦ భక్తులతోడఁ
శోభస్కరముగఁగూడియునీ
భజనలుసల్పచేయు ♦ టొక్కటిరామా!

97 నీకళ్యాణోత్సవమును
సాకల్యమ్ముగనుగాంచి ♦ సద్భక్తినినిఁ
ప్రాకటముగసేవింపగ
నీకరుణనొసంగుటొకటి ♦ నిజముగరామా!

98 నీహాకికధలచ్చునకై
సాహాయమొనర్పనీదు ♦ సద్భక్తులకుఁ
సాహసమొప్పగమనముల
నూహాజనింపంగజేయు ♦ టొక్కటిరామా!

99 నేరచియించినకృతులను
సారమతిఁయొక్కసారి ♦ చదివినమరలఁ
యీరసిచూడకచదవగ
నేరుపుగలిగించుటొకటి ♦ నీదయరామా!

100 నేలిఖియించినగ్రంథము
లీలోకమునందు వృద్ధి ♦ నొందువిధమునన్
చాలగ బ్రచురముచేయుట
కాలోచించుటయునొకటి ♦ హరిశ్రీరామా!

101 ఋణదాతలహృదయంబుల
కనికరమున్ గల్గచేశి ♦ కడుకష్టంబౌ
ఋణబాధదీర్చిబ్రోవగ
మనమునయోచించుటొకటి ♦ మహిశ్రీరామా!

102 నాదువంశంబునీభువి
మీదనుయభివృద్ధినొంద ♦ మీకృపచే స
మ్మోదముగ చేసినన్నిపు
డాదరముగబ్రోచుటొకటి ♦ హరిశ్రీరామా!

103 పొడిదుడుకులేక కాలము
గడుపుచుజీవించునట్టి ♦ క్రమమునునాకున్
కడువడినుపదేసించియు
తడసేయకబ్రోచుటొకటి ♦ దశరథరామా!

104 నేకోరినయీకోర్కులు
నీకరుణారసమునొసగి ♦ నిశ్చలమతితో
సాకల్యముగావేగమె
ప్రాకటముగదీర్చిబ్రోవు ♦ ప్రభువరరామా!

105 పలుమరునేమొరలిడగా
ఫలముగలదెనీవు కరుణ ♦ పాలింపంగా
వలెగానినేనుచేయం
గలదేమియుగలదుబ్రోవు ♦ ఘనుడవురామా!

106 అన్నివిధంబుల ననునీ
కన్నసుతునిరీతిగాను ♦ కడుప్రియమలరన్
మన్నించిబ్రోవుమెప్పుడు
నిన్నెనమ్మియున్నవాడ ♦ నిజముగరామా!

107 ఎక్కడనేదియుగాంచిన
నిక్కముగానీవటంచు ♦ నేర్పడుచుండెన్
చక్కగననురక్షింపుము
మ్రొక్కెదనీపాదములకు ♦ ముదముగరామా!

108 ఆరువేలకులజుండను
భారద్వాజసుడ గొల్లు ♦ పలి వంశజుడక్
యూరసిగను వేంకటసు
బ్బారాయుడబ్రోవునీవు ♦ భక్తుడగావా!

109 అష్టోత్తగశతకందము
లిష్టముగానీదుశతక ♦ మిడితిభక్తినా
కష్టములుదీర్చినాకిపు
డిష్టార్థములొసగిబ్రోవు ♦ మింపుగరామా!

110 మంగళమునీకు శ్రీరఘు
పుంగవనీసోదరులకు ♦ పుడమితనయకుక్
పొంగుచుహానుమంతునకునొ
సంగతిచేకొమ్ములోక ♦ సన్నుతరామా!

శ్రీరామశతకము సంపూర్ణము.



శ్రీః స్తు.

# విజ్ఞప్తి

సీ. పరగ శ్రీకాంచీని ♦ పాటి వాస్తవ్యుండు
బ్రాహ్మణుండును దైవ ♦ భక్తిపరుడు
వలనొప్పగా చర్కపల్లి ♦ వంశజుడగు
వేంకటేశ్వరశాస్త్రి ♦ విబుధహితుడు
నాకు హితుండౌట ♦ నయముగా నేరచిం
చిన రామశతకంబు ♦ సముగాను
చదవగా విని కడు ♦ సంతసంబొందియు
అచ్చు నేగూర్పింతు ♦ ననుచు బల్కె,

గీ. వారు వార్మెసకోడలు ♦ గారు పమిడి
సర్వలక్ష్మమ్మగారును ♦ సంతసమున
అయిదువందల ప్రతులను ♦ యాదరమున
అచ్చుగూర్పించి యిచ్చిరి ♦ మచ్చటగను.

## 2

సీ. వీరు పరంపరా ♦ శ్రీరామభక్తులం
చును నేనెరుంగుదు ♦ ఘనముగాను
వీరిజనకుండగు ♦ వేంకటసుబ్రాయ
శాస్త్రిగారోక రామ ♦ శాలభక్తి
గట్టించియుండిరి ♦ గాన నారాముని
యిప్పటికిని క్రమ ♦ నొప్పగాను
పూజించుచుండె నీ ♦ పుణ్యుండు
తమతండ్రి ♦ చేసినధర్మంబు వాసికెక్క

గీ. దానధర్మమటన్నను ♦ దండిగాను
కాలుద్రువ్వచునుండు ♦ వెన్కాడకుండ
పరమ సాత్వికముగ పూర్వ ♦ పద్ధతులను
విడువకను మెలగుచుండె నే ♦ వేళలందు.

గీ. ఇదియుగాకను నేరచి ♦ యించినట్టి
యాంజనేయుని హరికథ ♦ యచ్చ్యసకును
కొంతద్రవ్యమొసంగిరి ♦ కూర్మితోడ
వీరి యౌదార్యమునుగన ♦ వేడుకయ్యె.

వె. పరగ ప్రతిదినంబు ♦ పవలురాత్రిరివచ్చు
యతిథిజనములకును ♦ యధికభక్తి
నన్నమిడుచునుండు ♦ నాయాదరణమిట్టి
దనుచు బల్కనేర ♦ రవనివారు.

సీ. ఇవియిటులుండగా ♦ యింపుగావీరికి
పుత్రుడొక్కడు జోడు ♦ పుత్రికలును
గల్గియుండిరివారు ♦ కడుబుద్ధిశాలురు
కమలాక్షుపై భక్తి ♦ గల్గువారు
కావున వీరికి ♦ కడుముదమొప్పగా
సిరియు సంపదలను ♦ చెలువమమర
ధనధాన్యములు పశు ♦ ధనములొసంగియు
పుత్రపుత్రికలును ♦ పౌలుపుగాన
పౌత్ర దౌహిత్రులు ♦ పలుమందినొసగియు
ప్రేమతోడుత.ను శ్రీ ♦ రామవిభుడు

గీ. ఆయురారోగ్యమైశ్వర్య ♦ మఖిలగతుల
నొసగి రక్షించుచుండును ♦ నెసక మెసగ
పరమప్రీతిని నిరతమే ♦ కొరత లేక
తగిన సుఖమిచ్చు నాచంద్ర ♦ తారకముగా.

ఇట్లు,
గ్రంధకర్త.



శ్రీ

# శ్రీ రా మ శ త క ము.

కందపద్యములు.

1 శ్రీరామా నామది ని
న్నారూఢిగ వేఁడుచుంటి ♦ ననుదినమును నా
కోరికలీడేర్చక న
న్నీగతిని చేయతగునె ♦ యినకులరామా!

2 ఇహసంబంధపుకోర్కెలు
సహజముగావిడిచి నీదు ♦ సాన్నిధ్యంబే
యహరహముఁగోరితి నా
తహతహలుడుపంగదయ్య ♦ దశరథరామా!

3 చిన్నతనమునుండియు ని
న్నెన్నొగతులవేఁడుచున్న ♦ నేమరకను న
న్నిన్నిబాధలనుబెట్టుట
మన్ననగాదనుచు దెలియు ♦ మాశ్రీరామా!

4 పరమదయాకరుడనినన్
మరిమరి బ్రార్థింపుచుండ ♦ మాట్లాడవు నీ
దొంగతనపుగర్వమానీ
కరయగనిదిధర్మమగు ♦ సటయ్యా రామా!

5 మితిలేనికష్టములు నే
నతులితముగ పొందుచుండి ♦ యన్నింటికివే
గతియనుచు వేడుచున్నను
హితవుగనన్నేలకుండు ♦ టేలను రామా!

6 పెద్దవయస్సును వచ్చియు
పెద్దకష్టములనుగల్గి ♦ ప్రియముననిన్నే
పొద్దుమరువకను వేడిన
తెద్దయు నన్నేలకుంట ♦ తగునే రామా!

7 నీనామమంత్రజపమున
నానాసుఖములనుగల్గు నాకనుచును నే
నీనామమంత్రజపమే
పూనికతో చేయుచుంటి ♦ పొందుగరామా!

8 ఎంతగ వేడిన నాపై
పంతమొనేజేయునట్టి ♦ పాపఫలమొకా
సంతైనకరుణజూడవు
యింతటికాఠిన్యమేల ♦ యినకులరామా!

9 ఎప్పటికప్పుడెనన్నిటు
తిప్పలుబెట్టుటయెగాని ♦ దీనుడనని నా
కెప్పటికైనను కృపనిడ
వప్పాయీపాపమేమి ♦ హరి శ్రీరామా!

10 నినునమ్మినవారలకును
ఘనదుఃఖమెగాని సుఖము ♦ గల్గదటంచున్
జనులాడుకొనెడిమాటలె
ననువుగ తథ్యముగచేసితౌ ♦ శ్రీరామా!

11 ధర్మము న్యాయమెరుంగని
ధర్మవిహీనులకుమిగుల ♦ ధనసంపదలన్
నిర్మలజీవనమిడుదువు
ధర్మమె నీవిట్లుచేయ ♦ ధరశ్రీరామా!

12 భూములు గృహములు పుత్రులు
హేమంబును వస్తుచయము ♦ నెల్లవిభవము
న్నేమియుతోఁడనె రావని
నీమముగా వేఁడుచుంటి ♦ నిను శ్రీరామా!

13 అకటా నిన్నెప్పుడునే
ప్రకటితముగ వేఁడుచుంటి ♦ పరమదయాళు
తికమకలు బెట్టకను న
న్నకళంకంబుగను బ్రోవు ♦ మయ్యా రామా!

14 వేగమె నను రక్షింపుము
భోగిశయనరాజ ♦ రాజపురుషోత్తమనీ
వే గతియని యిమ్మతి నిక
నాగతిగను గొమ్ము లోక ♦ నాయక రామా!

15 నీచుఁడనని యోచింపకు
నీచులు ఘనులను చుభువిని ♦ నీకుఁ గలరే
నీచుఁడై నను గొల్చిన
నీచత్వము దొలఁగకున్నె ♦ నిజముగ రామా!

16 తల్లివి తండ్రివినీవని
యుల్లములోననమ్మియుంటి ♦ నొప్పుగవిను న
న్నల్లరిచేయక దయతో
చల్లగరక్షింపుమయ్య ♦ జనునుతరామా!

17 ఎవరేమన్నను వెరవక
నవిరళముగుభక్తితోడ ♦ ననిశమునిన్నుఁ
రవివంశచంద్ర వేడెద
భువిలోసత్కీర్తినొంది ♦ బ్రోవుమురామా!

18 దొరతనమున్నను ప్రజలను
పరిపాలనచేయవలయు ♦ పరమప్రీతిఁ
దొరననెడిగర్వమునభువి
పరిపాలించకసుఖ్యాతి ♦ బడయునెరామా!

19 ముదముగనిన్నెప్పుడు నే
సదమలమతివేడుచుండ ♦ సజ్జననుత నా
మదిగల్గుకోర్కెదీర్పవు
యిదితగునే యింతకఠిన ♦ మేలనురామా!

సిద్ధులలోనై ననినుఁ
తద్దయుభజియింపుచుంటి ♦ దయతోడుకనా
సుద్దులువినిననుకరుణను
ముద్దుగరక్షింపవయ్య ♦ మురహరరామా!
మరిమరినినువేడినా
మొరవినిరక్షింపవింత ♦ మోసముతగునే
నెరనమ్మియున్ననన్ను
తెరవుసేయతగదుబ్రోవ ♦ దీనుడరామా!
ఎల్లగతులనామదికను
కల్లోలమునొందుచుండె ♦ గావుననాపై
చల్లనికృపనిడిబ్రోవుము
సల్లలితముగానుదేవ ♦ సన్నుతరామా!
పండితులు తాముచదివిన
పండితవాక్యములనిన్ను ♦ బ్రార్థింతురు నే
పండితుడగానునేబను
చుండెడి తిప్పలనుదెల్పు ♦ చుంటినిరామా!

24 జరయును మృతియునుగల్గ్గి
నరుసట్టులధనముగూర్చు ♦ నరులకుమిగులఁ
కరమొప్ప ధనముసంపద
లిరువొందగగల్గచేతు ♦ వేమనరామా!

25 సిరులీయమటంచును నే
కరమొప్పగవేడలేదు ♦ గణుతింపగనీ
వరగుణములువర్ణించెడి
తెరవుజూపిబ్రోవుమంటి ♦ దీనుడరామా!

26 కష్టమ్ములెన్నిగల్గిన
నిష్టగభజియింపుచుంటి ♦ నిన్నెప్పుడునా
కష్టములుదీర్చి మనిగల
యిష్టంబులొసంగుమయ్య ♦ యినకులరామా!

27 మిత్రులవలె నటియింపుచు
మిత్రద్రోహంబుచేసి ♦ మెలగెడియానా
శత్రులనెల్లనడంచియు
నాత్రముగానన్నుబ్రోవు ♦ మయ్యారామా!

ఇహమునకను కష్టంబుల
తహతహపడుచుంటినేను ♦ దానవహరణా
విహగేంద్రవాహనా మది
తహతహలనుదీర్చిబ్రోవు ♦ దశరథరామా!

సంపన్నగృహస్థులమని
కొంపలుపడగూల్చునట్టి ♦ కుచితులకెల్లన్
సంపదలనొసగి సుజనుల
నింపుగరక్షింపకుండు ♦ టేలనురామా!

నీదాసులకును శత్రులు
వాదఃముగానీకుశత్రు ♦ వర్గమెగానన్
మోదముగవారినడచియు
నీదాసులబ్రోవుమయ్య ♦ నెనరుగరామా!

తనువు ధనము ప్రాణము నీ
వని మనముననమ్మియుంటి ♦ నంబురుహాక్షా
ననుదయతో రక్షింపుము
వనజాననవినుతభక్త ♦ వత్సలరామా!

32 నిజముగ నినుసమ్మితినా
భజనలుగైకొమ్మ మిగుల ♦ బ్రస్తుతిజేతుఁ
అజసురవందితనీకృప
గజవరదాయొసగిబ్రోవు ♦ కరుణనురామా!

33 వ్యవహారమెశాశ్వతమని
యవనీతపువృత్తితోడ ♦ నన్యాయముగా
భువియందుమెలగు మనుజుల
యవనీతిఁ ♦ దొలగచేయుమయ్యారామా!

34 సర్వమునీవనిసమ్మితి
నిర్వాహకమునునొసర్వ ♦ నేర్పుదొలంగెఁ
సర్వజ్ఞుడవగునీవే
సర్వంబునునిర్వహింపు ♦ సరగునరామా!

35 నీపరిసీలనకేన
ట్లోపగలను మీరలిట్టు ♦ లొరిపిడిచేయఁ
యాపదలబెట్టకను
సన్నిపట్టునకరుణజూపి ♦ నేలుమురామా!

6 పసచెనె దేహపటుత్వము
ముసలితనము హెచ్చ ధైర్య • మునుతీంచెఁ
వుసురులకు బలముతగ్గెను
యసురాంతకనీవెదిక్కు • హరిశ్రీరామా!

7 చెడ్డయాపదనుబొందియు
పడ్డచోట వెదుకుకొనుట • భావ్యమటంచుఁ
దొడ్డదొరనీదుపదముల
పడ్డవాడ నన్నుబ్రోవు • పరహితరామా!

38 రాముడునాకుఁగలడని
యేమిమొగిర్వపడుచుందు • నెప్పుడునీకా
రాముడుచేసిన లాభం
బేమొ దెల్పుమనెడివారి • కేమనరామా!

39 చచ్చినతదుపరియాపద
మిచ్చుటకై వచ్చుచుండ • నింతటిలోనఁ
చచ్చుటకునేమితొందర
వచ్చిననినయట్లులుండె • వహావరెరామా.

40 ఎలుకకు ప్రాణభయంబును
చెలువొప్పగ పిల్లిమదికి ♦ చెల్గాటయునుఁ
గల్గినవిధముగనుండెను
జలజాక్షా నాదుబ్రతుకు ♦ జగమున రామా!

41 శరణాగతరక్షకుడని
బిరుదువహించియునునన్ను ♦ బ్రియముగబ్రోవఁ
మరువేలబ్రోవకున్నను
బిరుదెట్టులనిల్చు శత్రు ♦ భీకర రామా!

42 శరణాగతుడను నేనుఁ
శరణాగతరక్షణుడవు ♦ సరగుననీవుఁ
శరణార్థులనిరసించిన
శరణాగతరక్షణాఖ్య ♦ జనుగద రామా!

43 మొదటనుత్రిప్పలుబెట్టిన
తుదకైనబ్రోతువనుచు ♦ తొందరపడకఁ
మదినమ్మియున్న నన్నీ
యదనునకరుణించిబ్రోవు ♦ మయ్యా రామా!